# దూ కు డు




ర చ యి త :

చందన మత ప్రతిష్ఠాపనాచార్యులు

నాగవంశం (నగరాల కుల చరిత్ర) నిర్మాత

క వి రా జ

డాక్టర్॥ సత్యాల నరసిబాబు. పాత్రుడు.

(కవితా సామ్రాజ్యం)



(ద్వితీయ ముద్రణ 1000 ప్రతులు.)

1949

స్వ ర్ణ కం క ణ ఔ ష ధా ల యం,

పువ్వులబావి వీధి,

వి జ య వా డ.




: :


[వెల 1-0-0.

నాచే రచియించ బడిన

# గాంధీజీ

# "అమర పట్టాభిషేకము"

అను గ్రంథము నందు

ఈ 'నాటకము' గ్రంథమును గూర్చి పలువురు మహామహుల
అభిప్రాయములు పొందు బరచబడినవి.

# విషయాలు











# స్వర్ణకంకణము

నేటి మానవ జనాభా మరణములలో సాలీనా లక్ష మంది క్షయ, ఉబ్బసరోగాలకి గురియై అందు తొంబది వేలమంది మరణించుచున్నారని తెలియుచున్నది. ఈ రోగ పీడితులను క్షయ, ఉబ్బస వ్యాధులనుండి తప్పించి, ఆయురారోగ్య భాగ్యాలు ఇచ్చేమందు పది సంవత్సరముల క్రితమునే గనిపెట్టి, అనేక వేలమందికి వాడి నూటికి నూరుమందికి గుణము చూపిన దని గ్యారంటీ చేయుచున్నాము. క్షయరోగులకు 9 రోజులలో గుణము ఉబ్బసరోగులకు వక మోతాదుతో గుణము.

9 రోజుల మందు కిమ్మతు రు. 9—0—0. 48 రోజుల మందు వకేసారి కొనువారికి రు. 30—0—0.

వివరములన్నియు మందుతో పంపబడును. ప్రశస్తమైన ఆయుర్వేద ఔషధములన్నియు శాస్త్రసమ్మతముగా తయారై యున్నవి. ధరలు సరసముగా యుండును.—

అడ్రస్:

**డాక్టర్: సత్యాల వరసిబాబు పాత్రుడు,**

స్వర్ణకంకణ ఔషధాలయం,

**పువ్వులబావి వీధి,**

**విజయవాడ.**

# సారస్వతం

—:o:—

సర్వాంగ సంపన్న సమృద్ధిగల్గి, రసికజన మనోవికాసమై చదువరులకు మధుర మధుర మధువై శ్రావ్యంబై రంజిలు జిలుగు నగిషీలతో భావసముద్రమున కరడుగట్టి ఊరుచున్న భావముల దివ్యంబౌ హారమాలికలచే కూర్చి నవ్యంబైన యుగంబున మానవజీవిత స్రవంతిలోని వివిధమతములలో విప్లవములేని అభ్యుదయ మతమును సృష్టించుటయే కవితాశిల్పము. ఇదియే సాహిత్యమునకంతకు పరమావధి.

ఈ గంభీర భావాంబుధిని గల రత్న సముదాయమును సానదీర్చి పలకకీగల పట్లను విచక్షణా చక్షువుతో పరికించేవాడే విమర్శకుడు.

ఇందుగల అత్యున్నత భావములను అభ్యుదయానికి, నగిషీలుతీర్చి, సామాన్య జనాళికికూడ గ్రహించే తన మృదు మధుర కవితా పానకముచే తడుపుచూ పోషించుతాడు కవి.

సారస్వత పిపాసకులు ముఖ్యముగా మతవైఖరిని గమనించి నిష్పక్షపాతముగా నిరంకుశముగా విమర్శనా సాదృశ్యముగా మానవ జీవిత ధనాన్ని మతతరు నీడనుచేరదీసి ప్రత్యక్ష ధర్మ నిరూపణ గల మత మారుతములచే హృదయ మాలిన్యము తీర్చాలి.—

విమర్శకుడు యేఘట్టము చదివిచూడదలచినా తనమ నేత్రము ముందు పెట్టుకచూస్తాడు. కవీశ్వరుడు తనమనో సంకల్పాన్ని చిత్రిస్తాడు. ఈ చిత్రము ఉత్తరుని ప్రగల్భములా ఉంటుంది. కాపుకాగదు కనులకందదు. హృదయమునకు గోచరించదు. మతసంస్కారము లేని అలంకార భూయిష్టములతో ప్రదర్శించితే శ్రోతల కానందమేగాని, సంఘానికేమీ ఉపకరించదు.

ప్రజాజీవిత విజ్ఞాన మేధా భవనంయొక్క అంతస్తులకు అవలీలగా ఊహాపోహాల నిచ్చెనలనువేసి సారస్వతము నెక్కించి అందందుగల చోద్యములను ఆనందమయ మానవ ప్రపంచము లోనికి దించడనే సారస్వత పరమావధి దీని నిజరూపాన్ని సృష్టించాలని తనవిచక్షణా ప్రజ్ఞా విశేషణాలంకారాల్ని దూర్చి గద్యముగానో పద్యముగానో తనఘంటం పోట్లతో కదిపి కుదురైన కుదుళ్ళనుకట్టి పుష్ప ఫల భరిత శోభాయవంతముగా అచ్చెరువంద జేసేదే కవితావనం.

ఈగంభీర సుందర ప్రకృతి కవితా వనములో అడంగియున్న నవరస భావలతల ఉత్తమ లక్ష్యాల్ని పామర జనాళికి సయితము అతిసులువుగా చూపే టార్చిలయిటు వెన్నెల్ని వేసేదే. విమర్శనా వృక్షం యిట్టి విమర్శనా చక్షువులు గల రసికజన మనో వికాసానందాభిరాములు కరువుగా నుండబట్టే, పరదేశీయ విజ్ఞానాన్ని అరువు తెచ్చుకుంటున్నాం. మనసాహిత్య మీమాంస శాసన శాస్త్రాలు కమ్మదనాలు కురిసే కావ్యాలు,

కొలంటుముక్కీ చదల పత్రాలం చదువవలసిన పరమగళ తొచ్చె. సాహిత్యవనంలో ఊడలుదిగిన సనాతన వృక్షాలకు, పండిత తరువులకు, కవిక్రీపర్ణులకు, గాయక కోయిలలకు యిచ్చిన పదవితో విమర్శకుని శిల్పిని చిత్రకారుని పరామర్శించక పోవుట చేతనే కవితాభానము స్పష్టపడక పాటకునికి హాయి కలుగుట లేదు.—

ఇహ, యే రెండో సంపన్నత ముక్కల్ని పుక్కిలిబట్టి బోకరించే వేకరింపులకు బోర్లపడి పరిహరించవలసి వచ్చింది—



# నా సామ్రాజ్యాధీశ్వర్లు.

| | | |
|---|---|---|
| దూకుడు మొదటి భాగము | ... | 1-0-0 |
| వందన మత భాష్యం | ... | 1-0-0 |
| అరుంజ్యోతి | ... | 1-0-0 |
| మహల్ | ... | 1-0-0 |
| నారద భూలోక సంచారం | ... | 1-0-0 |
| గాంధీజీ అమర పట్టాభిషేకం | ... | 1-0-0 |
| నాగవంశం (నగరాల కుల చరిత్ర) | ... | 8-0-0 |



Printed at Sundari Press, Vijayavada.
IInd Edition 1000 Copies—1-1-49.



క వి రా జ

డాక్టర్. సత్యాల నరసిబాబు పాత్రుడు,

చందనమత ప్రతిష్టాపకులు, నాగవంశచరిత్ర నిర్మాత.

# యుద్ధం

సర్వప్రపంచ ప్రజా ప్రభాశక్తి ప్రసూనము వెలుంగునే పాలిస్తుంది. అజ్ఞాన తిమిరాన్ని పారద్రోలి విజ్ఞాన కిరణాలు ప్రకాశింపజేసే దివిటీపట్టాలి. నానామత విప్లవాలు చెలరేగి, మానవజీవాలు మారణయంత్రాలకి బలియౌతున్నై. అమాయక అనాగరిక ప్రజానీక రక్తప్రవాహాలు ధారాళంగా ప్రవహించి సముద్రా లవుతున్నై.

ఇట్టి ఘోర విపత్పర్వత పరంపరలన్నీ పైనబడకుండా, దేశాభ్యుదయానికే నావ్యాసలేఖిని వరవడి పెట్టింది. సవిమర్శనా దృష్టితో దీన్ని దిద్దుకోలేక, హింసాయుతమైన, మత విప్లవ మతాబులు మండుతున్నై. ఈవిప్లవాగ్నికి తట్టుకోలేక తబ్బిబ్బై మానవ విజ్ఞాన విహంగాలు తాహుమారవుతున్నై.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక, తంత్రాలే నియంతల మంత్రాలై నరబలులు కోరుతున్నై. ఏజాతి చూచినా, ఏసంఘముదలచినా, ఏదేశము గాంచినా, ఏజగము తిరుగవేసినా, ఏ లోకాన్ని విలోకించినా, ఏ యుగాన్ని పరికించినా, స్వార్థమత రథాలే పరుగెత్తుతున్నై.

ఏ వంకజూచినా ఘోర మారణ మరఫిరంగులుమ్రోగుతున్నై. ఏదిక్కునుజూచినా భయంకర రణవిన్యాసాలే కాలు

దువ్వుతున్నై. ప్రస్తుతం పరాధీన పారాయణధురీణ దుం. ప్రముఖులమైన మనదాక యీవిలయాగ్ని వ్యాపించింది ప్రజ్వరిల్లింది.

ఇంత గలభాలోనుంచి లేచిన దీని ఘోషవల్ల బోధపడిందేమిటయ్యా అంటే ఆర్థికబాధ నేటి అఖండ సంగ్రామరంగానికు వుఱికిన యువక గణంలో స్వదేశోద్ధరణ, వీరవాసన రణ కౌశలత ఎంతవరకుండునో రణకోవిదులే చెప్పాలి. "సర్వం సర్వత్రో భద్రా ఉదర పోషణార్థం, సిపాయివేషం," అంటానికి వీల్లేదు.

విజయవంతమైన వీర భేరీరవాలు మిన్నుముడుతున్నై. ఇహ సాంఘిక రాజకీయ రంగాలకి దుముకాలంటే, ఆధ్యాత్మికపు అంగడి తెరవాలి. అందున్నా చందనమత సుగంధ ధర్మాశీర్వాదాలు అమ్ముడు పోవాలి.

నానా మతవిప్లవాలు ఈ దెబ్బతో అరికట్టాలి. ఆబాల వృద్ధులూ అన్ని దేశములందు ఆశించి ఆనందించే చందనమతం ముందుకురావాలి.

ఈ నవ్య ప్రపంచ ప్రభాత లక్ష్మీనగరమున జయజయ ఘంటా నినాదాలతో చందనతరు న్యాయ పతాకం లేవాలి. త్వరత్వరగా నలుదిక్కు లెగబడి జాతీయోన్నతి తెచ్చేడి మన నిరంకుశ లేఖిని అణువంచని నడక నడవాలి.

నానాదేశ రాజకీయ రంగాలలోనూ సాంఘిక, మత, చర్చచర్చల లోను, వ్యవసాయ వ్యాపార వ్యవహార సభల లోనూ, విశ్వజన మైత్రి రేకెత్తించెడి ఉత్తేజాన్ని పరుగెత్తించాలి. ఈమత వృక్షపు ఏశాఖ వాసన చూచినా సువాసనే రావాలి. ఏఖండాన్ని తడిచినా దేశ సేవయే లేవాలి. ఏ రేణువును పరికించినా మానవాభ్యుదయానికే ఉపకరించాలి.

ఇహ చిమ్మచీకట్లో గమ్మత్తుచేస్తున్న దేవుడు మనకొద్దు. బుద్ధులు మానవులవి. యుద్ధాలు దేవాసురులవి. దేవాసుర మానవ హృదయ వీధుల్లో నా చందస మతవిమానం వదలాలి.

## వందనం

సిద్ధాంత రాద్ధాంత హిందూ మతోద్ధారకుల మనియు హిందూసంఘ సంస్కర్తలమనియు సనాతన పీఠ దుర్మార్గ దుంధుభులు మ్రోగుతున్నై. హిందూమత ధర్మాలే అనువైన మార్గాలని అంతూ పొంతూలేని గణాచారత్వాలూగుతున్నై. వీటివల్ల ప్రపంచానికి యేం ప్రయోజనం. ఈ హిందూమతాన్ని సంస్కరించి నేకముఖతా నడిపించే కిరీటధారిశూన్యం.

ఇహ ఈకిరీటాలు లేని బోడిసన్యాసుల్లో బోకరింపూ భోగలాలసత్వ ధురీణత్వమే ప్రకాశించి ప్రభోధిస్తుందేగాని ప్రజా సంస్థల్లో పాతుకుపోయిన నానా మత ధర్మాల్ని పెకలించి, నవరించి, సర్వజన సౌభ్రాతృత్వానికై స్థిర సంకల్పాన్ని ప్రసాదించే నవయుగ ఆదర్శక గేయాలతో గానాలాపనచేసే కాషాయ కౌపీన కమండల ధారి కానరాడు.

ఇహ, ఈ హిందూమతం శాసన బద్ధంగా సాగాలంటే మహమ్మదీయ మత కట్టుబొట్లను యెట్ట యెదుట బెట్టుకొని విచక్షణాచక్షువు తెరవాలి. సెబాస్ అని ప్రతికక్ష్యులు పెదవి విరవాలి. పెంకితనం ప్రబలాలి.

మహమ్మదీయ మతస్థులు ఖురాను నియమాల్ని సాధ్యమైనంతమట్టుకు గడితప్పకుండా ఆచరించి ప్రబోధిస్తారు. నిరుప యోగ ప్రయోజకత్వాన్ని ప్రదర్శిద్దామని విమర్శనా దృష్టితో పరామర్శించరు.

గుటి కుదరందే గుణమెలా కుదురుతుంది? ఏరి మత కట్టు బొట్ల మహత్తర ప్రభావాల్ని బోధించాలంటే వారి పైగంబర్లే చెప్పాలిగాని మన స్వార్థపరాయణ మంత్రవేత్తల మహిమల కందవు. మహమ్మదుగారి మత సంస్కార ప్రభావగరిమ మన మహాత్ములవద్ద సహస్రాంశమైనా వుంటే, ఇన్నిమతాలు, ఇంటింటా యిన్ని దేవుళ్ళు దేవుళ్ళాడేవేకావు.

వేయేల వందనం చూడండి హిందువుడికి హిందువు కని పిస్తే వందన నియామక హిందూసూచన్ని వెలబుచ్చుతాడు. మహమ్మదీయుని గుర్తించండి. అతని కేమతస్థుడు కనిపించినా సలామంటాడు. ఈ ముస్లిం మతస్థుని వద్ద ముఖ్యంగా నేర్చుకుని తమ జాతీయవర్తనం సరిదిద్దుకోండి. ఇది యెంత సామాన్య విష యమో చూచారా?

ఈ ముస్లిం దృష్టికి అన్ని జాతులూ ఒకటే. అందర్నీ సలామనే సంబోధిస్తాడేగాని, మన హిందూ మతస్థులమాదిరి వేషాలు వేయడు. అంటే హిందువుడు కనిపిస్తే నమస్కారమని, మహమ్మదీయుడు కనిపిస్తే సలామని, క్రైస్తవుడు కనిపిస్తే గుడ్ మార్నింగని, తన జాతీయతను మఱచిన బాస తప్పెడి వాలకం వేయడు. అన్యమతావలంబకులు ఏ సిగ్నలిస్తే అదే హిందూ ఆచరిస్తాడు.

మహమ్మదీయుల తరువాత ఈ నిశిత స్వజాతీయ నియమం చూడాలంటే ఒక క్రైస్తవుల్లోనే తొంగిచూస్తుంది. ఈ వేదశాస్త్రుల కవిలికట్టల కళారాధకులంతా ఈ స్వధర్మాన్ని పాఱజూడక, పరమ భాగవత సనాతన నానామత సంస్థాపకుల మని ఱొమ్ములు విఱచుకొని, లల్లి బొల్లిబోధల్తో బాధలు పెడుతున్నారేగాని విజ్ఞాన పింఛాన్ని విప్పి ఆచరణ యోగ్యాన్ని అమల్లో పెట్టే సహస్రాక్షుడు లేడు.

హిందూ మతైక్యత కావాలి. అంతేగాని అంబారీలపై లంబాడీ సజ్జ తగిలించుకొని ఛత్రచామరాల్తో లొట్టిలమీద పట్టినన్ని నబూత్ ఖానాలు వ్రేలాడేసుకొని, భూతిపణ్ణశాలలకు పయినపై రంగారు బంగారు సింగారాల సింగినాదాలు మిన్ను ముట్టించుకొని మీగాళ్ళమీద జీరాడు జేగురు లుంగీలో, అంగీలో ధరించి; కష్టజీవాల కష్టాల్ని కన్నెత్తి పాఱచూడక వారి శల్యాలపై స్వార్థ రథ సారథ్యంబాగా సాగించే పనితనము ఈ పంగనామాలు ధరించి, ధరింపజేయడంలో చూపెట్టారుగాని

ఎదుటవా డేజాతివాడైనను విజ్ఞానవంతుడైన మానవ జాతి సంతోషముతో ప్రోత్సహించాలేగాని వాని అపశబ్దము లెన్నుకొని తన్నుకొనుట జాతీయత కాదు.

పొరుగు పచ్చగానున్న పొయ్యిలో ప్రక్షాళము గావించుకొనుట యేమిధర్మం? ఎదుటివాడు తమకు ఆజన్మాంతరము దాసోహానే చేయాలనుకొనేదే మత ఆచారం.

ప్రేమధనరూపమే యెరుగక కృత్రిమధనరాజ్య సంపాదన లకై కూనీలు చేసుకొనే మీరు దైవ సాక్షాత్కార ధనాన్ని యెప్పటికీ చూడలేరు.

కామకలిమిగల యొక బలాఢ్యుడు వకస్త్రీని కామ వాంఛచే కోరుకొని చిత్రించి తదేక దీక్షతో ధ్యానించి నిదురించినవాడు స్వప్న కథల్ని కన్నాడంటే ఆ స్వప్న సాక్షాత్కార ఫలితము తానెంతవర కనుభవించగలిగెనో అనుభవజ్ఞులకు తెలిసిన విషయమే.

ఈ యువకుడు కామారాధనచే కలలోబొందిన భోగ సౌఖ్యాన్ని ఆ స్త్రీకేమైన తెలియునా?

ఇట్లే వకభక్తుడు యేదోవక ఆకారాన్ని దేముడని ప్రేమించి నిష్ఠాగరిష్టుడై గంపెడంత ఆసతో వ్యసనపడి వెంపర్లాడి భగవత్ సాక్షాత్కార నిరీక్షణతో పరుండి కాంచే తన కలలో తానారాధించే బొమ్మాకారమే ప్రత్యక్షమై అగ్రహారాలే యిచ్చిందనుకొండి. అవేమైనా ఈ కల గాసినవాడు

జే. జే. భేరీ నినాదాలు వినూత్న శంఖారావ సమ్మేళ నంతో సర్వ జన సౌఖ్యదాయకమైన కంచుకోట కట్టాలి. ఇందుకు పునాదుల పరికరాలకై సనాతన సంఘ సమాధుల్ని పూర్తిగా పెళ్ళగించాలి. వినూత్న విశాల, వినిర్మల వీరవిహారా రామాలు అంతస్తులపై అంతస్తులు వేయాలి.

అందు నాచందన తరున్యాయపు బోర్డు సువర్ణాక్ష రాలతో చెక్కాలి సులలిత సుందర సుకుమార రసికజన రమ ణీయ మనోభిరామలందు కాపురం చెయ్యాలి.

ఈ అనన్యచూడామణుల సంస్కార భావ ప్రభావాలచే వెలచిన చందన తరు సుగంధ వీవనలు దిశేల కెగదన్ని లాలించి పాలించే కవి పండిత వేదండులంతా గంధ గజారోహులయి ఆహ్వానాలంచాలి. నానా జాతిసమితికి జాతీయచిహ్నము వందనమే యని తేలాలి.

ముస్లీము మతానికింత ఆధిక్యతా అంటారేమో? అసలు హిందూ అనే శబ్దంలో అంతర్వ్యాపినిగా ప్రవహిస్తున్న అర్థము గ్రహిస్తే గప్‌చుప్. వందనములో వాలుకు సామరస్యము సార్థక పరచమంటున్నా. అందులోగల మార్దవము మనోదాంట్లో లేదంటున్నా హిందూజాతీయ విజ్ఞాన చిహ్నన్నే వినియోగిం చాలంటున్నా. ఇచ్చవచ్చినట్లల్లా చేతులెత్తి తుదకు తలతో మొల చూపు నమస్కారాలొచ్చాయంటున్నా అట్టి వాటికి సరిమైన వినయ విధేయతల వెదజల్లు రెండుచేతులూ జోడించే వందనం బూడిద చేశారంటున్నా. మొడా పెడా వంటిచెయ్యే

లేచే ఆచారము ప్రబలిందటున్నా, యెడమచేయికి కుడిచేయికి గల తారతమ్యము గ్రహించలేనివారు గనుపించినా రెండు చేతులు జోడించి వందనమే చేయమంటూ రెండు చేతులు జోడించుటలోగల మహత్తర ప్రభావగరిమ నెరిగి వర్తించా లంటూ. ఇక శెలవు.

## మతం

అమాయక ప్రపంచ ప్రజానీకాన్ని పురస్కరించి సంస్కార రంగానికి తెచ్చే విమానంలాంటిదే మతం.

అతి మనోహర ప్రకృతికి విశాలమైన మానవ హృదయానికి గల అవినాభావ సన్నిహిత బంధుత్వాన్ని చూసే మీటరులాంటిదే మతం.

స్వార్థ మత హితోప దేశాంధకార మార్గము ద్రొక్క కుండా కాపాడి రక్షణ నొసగే మిలటరీ లాంటిదే మతం.

ఈ నవ్య ప్రపంచమున ప్రతిమానవుడు, ఏమతం దేశానికి ఆదర్శమౌతుందో, యేమతం జగమంతా యేకంకావాలని వాదిస్తుందో, యేమతము మానవ జీవితాంధకారమును కాచి కమ్మెచ్చున తీయగలదో, యే మతసముద్రమున జాతీయ తరంగము లెగురుచున్నవో, ఏమతం మానవ విజ్ఞాన తేజస్సును సానదీర్చి ముందుకు నెట్టుకు పోగలదో, ఏమతం ఆది, మధ్య, అవసాన కాలము లందందుబాటులో యుండునో.

ఏ మతం జాతిమతభేద రహితమై జీవస్రవంతిలా ప్రవహిస్తుందో, ఏ మతం శుభాశుభములందు అగ్రస్థాన మలంకరించి ప్రజలందు చున్నదో, బుద్ధిని కేంద్రస్థాన మలంకరించి కన్ను తెరవండి. మానవ జీవయాత్ర వడిదుడుకులు లేకుండా నడిచే శాశ్వత మతనౌక యెక్కండి.

నేడు దేవుళ్ళని అంతస్తులపై అంతస్తులు మిన్నుముట్టించే శిలా విగ్రహాలు, దేశాభ్యుదయాన్ని మానవ మహత్తర ప్రభావాన్ని బైటకు రానీయకుండా కప్పిబుచ్చుతున్నై.

ఈ బోడిరాయి దేవుళ్ళు ఈబోడి సన్యాసి సామ్రాట్లు ఈ బోడి కళారాధకులంతా భూలోకమును బూడిదచెయ్యాలని వెలసినవారే.

ఇహ వీరివలన లాభ మెవరికయ్యా అంటే, వక బండిలో అంగవికలులను కూర్చుండబెట్టి "కళ్ళు కాళ్ళు లేవు నారాయణ" అనే కీర్తనలు బాడుకొని కొన్నిజీవా లేలా బ్రతుకుతున్నాయో ఆమాదిరి సోమరిపోతుల ఉదర రక్షణకై ఈ పెద్దపెద్ద యెద్దు విగ్రహాలు ఈ మొద్దునున్నని సన్యాసుల పురెలు పనికొస్తై.

విశ్వజనమైత్రి కోరిక ఫలించే సర్వజన మైత్రీ విపంచీ నినాదంతో జాతీయ గీతములు పాడే గాయకుడు రావాలి.

(2)

జగజ్జనని జేగీయమాన జాతీయ ప్రభావాలు గీకే నిరం కుశ కవితా చక్రవర్తి ఘంటం కదలాలి.

ప్రపంచవాణి ప్రేమ సౌలభ్య స్థిరసంకల్పాన్ని తీర్చి చిత్రించే శిల్పిశాసనం పసి కనిపించాలి.

ప్రజాశక్తిని యేకముఖతా నడిపించే నియంతల నిర్మల కౌశలం కనుపర్చాలి. సర్వజన సౌఖ్యాశాయ త్తమై విప్లవము లేని చందన కుదురు కాపాడే మాలీల మత్తత పోవాలి.

సత్యం వధ

ధర్మం చర

చందనం స్థిర

# చందనం

'పరోపకారార్థం ఇదం శరీరం' అన్న బుద్ధభగవానుని వాక్యాన్ని విమర్శనాదృష్టితో గమనిస్తే ఈ మహావాక్యంలో ఉన్న నిగూఢ భావం తెల్తుంది. జగద్గురు పీఠాన్ని అలంకరించిన బుద్ధచక్రవర్తిలాంటివాడే తాను నుడివిన వాక్యానికి తగిన సేవ చేయ గలిగేడేమో గాని దానికితగ్గ నిఖార్సయిన దారి త్రొక్కలేదు.

ఈ వాక్యానికి సరిఅయిన పాకంగల తూకంగావాలంటే నా మహా వాక్యేతప్ప ఇంకొటిలేదు. అది యేమిటంటారా "చందనతరున్యాయం" పూర్వమనేకు లనేక మార్గాలు త్రొక్కేరుగాని ఇదమిద్ధంగా నాచే నిర్ణయింపబడ్డ ఈ మహా వాక్యంతో సరిపోరు. పరోపకారార్థం ఇదం శరీరమంటే పరులకు ఉపకారము చేయటానికే ఈ శరీరమని.

ఇది యెలావుండాలో చెప్పాలనిపించింది. ఆ వెంటనే మన దశావతారాల్ని యేసు మహమ్మద్ బాల్ లాల్ పాల్

మొదలగు ప్రవక్తల్ని దేశనాయకుల్నేగాక యే హిమాలయాల మూలలనో వేలకొలది సంవత్సరాలబట్టి ఊపిరి బిగబట్టుచున్నారనే మహర్షి సముదాయాన్ని నిలవేసి కంచుకాగడాతో పారచూచాగాని. ఈ పై వాక్యాన్ని జీర్ణంచేసికొనియదార్థాన్ని తేన్చిన ప్రేగొకటైనా నాకంటికి అగపడలేదు.

పైవారి పాట్లల్లా ఉండగా గృహస్థులనుగూర్చి వేరే వ్రాయవలయునా? వారు తమతమ స్వార్థాలకై చేయు భార్యా పుత్రాదుల సంరక్షణంతా ప రో ప . కా రం కా దా అని బూకరిస్తారేమో.

ఇహ పైనుదహరించిన మేధాసంపన్నులంతా "భ్రమర కీట" న్యాయాన్ని పుక్కిటపట్టి ముదుస్తున్నారేగాని తమకళ్ళెదుట పరోపకారమంటే నాశరీరం మాదిరిగా ఉండాలని తాండవిస్తూ ప్రత్యక్షదైవమైన నా చందనతరు న్యాయాన్ని గుర్తించరయిరి.

ముందు భ్రమరకీట న్యాయపు కూతవినండి. భ్రమరము (తుమ్మెద) పేడలోవున్న నకపురుగును మాత్రమే తెచ్చి దినదినం తన నినాదాన్ని వూది కొన్నాళ్ళకీ క్రిమిని తనంతదాన్ని చేయ గలిగింది. ఈమాత్రానికే సృష్టికి ప్రతిసృష్టి చేసిందని అందలానికెక్కించేరేగాని ఈ క్రిమికీటకాలు రెండూ నకలై ప్రపంచానికి వాటిశరీరాలేమి ఉపకరించాయో చెప్పండి?

ఇహ నా చందన తరున్యాయములోఉన్న గుణాల్ని కూడా కూతకు వదుల్తున్నా. ప్రయిజు యెవరిదో చదువరులే తేల్చండి. తుమ్మెద యెచ్చటికి యెగిరి పోవాలంటే అక్కడికి యెగురుతూన్న చలనమూర్తి.

నా చందనమో అచలనమైనది. చలనముగల తుమ్మెద జేసేపని నా చందన తరువునకు నిత్యకృత్యమైన సామాన్య

ధర్మము. చూడండి, తానునసించు ప్రదేశమునగల నానావృక్ష సముదాయానికి తన సుగంధ పీవనల ప్రసాదముచే కొన్ని కొట్ల వివిధ వృక్షములను తనమాదిరి తయారు చేయుచున్న దంటే, దీని సంస్కారణ ప్రభావ మహిమయొక్క తొలిదెబ్బకే మీా సనాతన భ్రమరకీటన్యాయము బోల్తా కొట్టింది.

వృక్షరాజైన నాచందన తరువు నిర్జన ప్రదేశంలో పుట్టి స్వభావజనిత సుగంధముచే కాయశుద్ధి కల్గి, తనయం దుదయించిన పరిమళ ధర్మవీచికలచే సంఘ సంస్కారణ చేసియు తనివితీఱక మానవలోక నియంతృత్వానికై ఎగబడి దేశసేవఅంటే యెలా వ్రుంటాలో తమకి ప్రబోధించాలని ఆమూలాగ్రంగా తన శరీరాన్ని నఱకబడి ఖండ ఖండాలుగా విభాగించుకొని నానాదేశ పర్యాటనజేసి, తన సుకుమార సుధారస సులలిత సుగంధ పరిమళ ప్రభావాలచే మేఘరాజై, మానవ శరీరాల నిజ మాంద్యమువాపి ప్రచండ భాస్కర్లను గావించుటకై రాతిమీాద తా పడి, అరుగబడి, తన ప్రతిరేణువు సమస్త సామ్రాజ్యాధిపతికి, స్మశాన సామ్రాజ్య పట్టాభిషిక్తుడికి ప్రధాన గౌరవ శోభ తెచ్చిపెట్టి దేశానికెక్కె వన్నెచిన్నెల మకుటమై ప్రజానీకానికి ప్రత్యక్ష దైవమై పూజలందుచున్నది.

ఓ నా భూవలయ మేధావంతులారా! అనుపమాన శౌర్య గంభీర వీరపురుషులారా! సనాతన, నానామత సంస్థాపకులారా! వివిధ కుల పర్వతోద్ధారకులారా! తేజోవిరాజమాన నియంతలారా! నాపల్కుబడు లాలింపుడు. నన్ను గుర్తింపుడు.

నేటివఱకు నాయం దుదయించిన సుగంధ సౌరభము మాత్రమే మీసనాతన కవిపండితా ఖండలులు గనిపెట్టిరే గాని, నాశరీర నిజసేవ గ్రహించలేదు. స్వార్థపరు లిది గుర్తించుట పొసగదు.

యావద్భారత ఖండవీరులు నామాదిరి దేశాని కుపక రించాలి. అప్పుడే మీయందు వినూత్న తేజః పుంజములు వెలు వడి విశ్వకళ్యాణ తోరణములు జగమంతయు ప్రకాశించుచుం డును. ఆనాడే మీరు స్థిరమైన భరతవీరులని విజయభేరీలు మ్రోగుచుండును.

విజయవంతముగా మీనుండి వినూత్న వీర శంఖారా వాలు మిన్ను ముట్టాలంటే నాచందన తరున్యాయాన్ని మనన చేయండి. ఈ న్యాయ ప్రదర్శనకు ఇతరమత విప్లవముగాని, రాజకీయారావముగాని, సంఘ బహిష్కృతత్వముగాని, సనా తన విరుద్ధముగాని లేదు.

దీనిని మననజేస్తూ విజయవీరపతాక పాదపద్మములకు వీర చందనం అద్ది, జయజయా జయజయా విజయ గానారావా లతో జాతీయ గీతాల్ని పాడండి.

అంతేగాని, దేశసేవా పరాయణులమని, దేశోద్ధారకుల మని, జగన్నియంతలమని, చావగా మిగిలినవారు చెలరేగి పైకుబికి

గొప్పగొప్ప డాంబిక సిబ్బందుల్ని తయారుచేసి అమాయక, అనాగరిక, అయోమయ ప్రజలముందు కవాతులుచేయుట దేశ సేవగాదు. అట్టివారు సంఘసేవ కేలా ఉపకరిస్తారు? ఆత్మసేవకు కూడ అర్హులుకారు. ఇది ముఖ్యంగా యావన్మంది గమనించ వగ్గ మహత్తర విషయము విశ్వాసము.

పరోపకారం చేయాలనుకొని ముందుకువచ్చేవారు దిగం బర శరీరులుగా తయ్యారుకావాలి. ఇది తెలుసుకోలేక తాముచేసేదంతా దేశ సేవయని ప్రగల్భాలుకొట్టే మహా నుభావుల స్వార్థ పథసారథ్య విజృంభణ నానాదేశాల్లో సాగి స్తున్నారు.

# సంస్కారం

గృహస్థధర్మాలే యెరుగనివాడు సంఘసంస్కారి ఏలా కాగో? సంఘ సంస్కారి కానివాడు మతమెరుగలేడు.

ముందు తనవళ్ళూ, తనఇల్లు, తన కులము వీటియందు లక్ష్యముంచి ధర్మ మార్గానువర్తియై తరించినవాడే దేశసేవకుడౌతాడు. ఇట్టి మహత్తరమైన ప్రభావాల్ని ఉపాసించేవాడే దేశసేవకుడనటానికి అర్హుడౌతాడు. ఇట్టిసంపూర్ణ వివేకధనుణ్ణే నియంత అనదగుతుంది.

గృహస్థు మొదలు నియంతవరకు గల అనంత ఉత్తమ లక్ష్యాల్ని ఆచరణీయంగా సాధించినవాడే జగన్నియంత అనబడుతాడు. ప్రతివాడు జగన్నియంత కావాలి. అట్టి సాధించెడి సామర్థ్యం సమస్త దేశాలకివుంది. ఇందుకు నా చందన తరున్యాయం ఉపదేశించి ఉపాధ్యాయత్వాన్ని చలాయిస్తుంది. నానామత వృక్ష రాక్షసులు నాబడిలో విద్యార్థులుగా చేరండి. రుసుములేని సులువైన అనువైన మార్గాన్ని వినండి.

# దేవస్థానం.

అతి ప్రాచీనమునుండి అమాయక అనాగరిక ప్రజానీకాన్ని పీల్చి పిప్పిచేస్తున్న ఆస్థానాలే దేవస్థానాలు. ఇందు సువర్ణ సింహాసనా లధిష్ఠించి, కొలువుదీర్చి, కప్పాలందుచున్న దైవాలే మూగశిలా సమ్రాట్లు.

వీరి దేవారాధన పరిపాలనా ఘట్టములోగల నిష్కల్మష ప్రజావళికి వరప్రసాదా లిస్తామని, తొమ్మంద్రు కుతంత్ర యేజంట్లచే ప్రచారాలు చేయించుకొంటున్నై.

ఎన్ని యుద్ధాలాపాదించినా, యెన్ని ప్రళయాలు తటస్థించినా చావనేదిలేక వీటిని కని స్థిరజీవంపోసి కళారాధకుల మెప్పుపడసి శాశ్వత జిరాయితీలు ఈ రాళ్ళకిచ్చి కూర్చుండ బెట్టిన జగద్విరాట్ విశ్వశిల్పి ఆనవాలు పామర జనాళి పారచూడ్డంలా.

ఈ ఆస్థానాలకొచ్చే అసల్ఫాయిదాలు అర్చక యువ రాజ సోమరి రాయల్ ఫేమలీల మనోవర్తికై భుక్తమగుచున్న దేగాని వీళ్ళ దైవాలనుగన్న శిల్ప సమ్రాట్ కేది వాటా?

ఇహ భక్తిరసపిపాసులై ప్రజలు చేస్తూన్న దేవాలయ నిర్మాణాల వలన వచ్చే ఫలితాలు చూద్దాం. విజ్ఞాన శూన్య

లైన అజ్ఞాన గణాచారాలూగటానికి, సంతానవాంఛా రోగులు పాణాచారాలు పడటానికి, అంతస్తులపై అంతస్తులు వేద్దామనే అసంతృప్తులు లెంపలు వాయించుకోనడానికి. వివిధ వాంఛలు గల అవిద్యావేత్తలు ప్రదక్షిణాలుచేసి నిరుద్యోగ నిద్రాదద్దమ్మలకు దక్షిణ తాంబూలాలు సమర్పించుకోడానికి, గుగ్గిళ్ళు పులిహోరబుట్టలు ముందుబెట్టి దేవస్థాన సామంతుల్ని బందరాబోతులుగా తయారుజేయడానికి, ఈ దరిద్ర దామోదర రాయల్ ఫేమలీలు అమీర్లను చేయడమే ఫలితంగా వుందిగాని; ఈ సిలా సమ్రాట్‌లవలన భక్తజనాళి కాపాడించే భావికాల అర్థాలోకం అవగాహనం కాలేదు.

అసలీ నవగ్రహాలు బూజెదపూసుకొని భూలోకనాయకత్వానికి యేలాదిగారో చూద్దాం. ఈ శిలావంశం ముక్కులో నుంచి ముడ్డిలోనుంచి ఈలా నవ రంధ్రాలలోనుండిజారి వారి వారి స్వయంప్రకాశపు టుదరపోషణ స్వధర్మ విజృంభణలచే తొమ్మిదిపాయలుగ చీలి అనంతకోటి దేవతలను అష్టాదశపురాణాలను సృష్టించ భూసుర ప్రభుత్వాల్ని స్థాపించి అమాయక రాజ్యంలో అనాగరిక ప్రజల్లో వివిధ వేష భాషాదులతో దూరి వాక్ పరిపాలనా దక్షులై స్వార్థతత్వాల్ని లేపి మీకీమూగ రాయి అష్టఐశ్వర్యాలిస్తుంది., మీగురుడు తొమ్మిదింటికొచ్చాడు సహస్ర నామార్చన చెయ్యండి మీతుప్పెలా రాలుతుందో చూడండి.

ఈ విధమైన భ్రమజనిత ప్రమాద డోలికలలో తూగు చున్న పిచ్చిప్రపంచమునుంచి అంధకార జోలగీతాలతో జోకొట్టుచు తమ తర తరాలకి కావలసిన శాశ్వతపిండాల్ని వేయించుకొంటున్నారు.

ఇహ బంగారు సింహాసనాలకి రత్నకిరీటాలకి వెండిపిడి వింజామరలకి రాగి ధ్వజాలకి వీరి కాపురానికి మిన్నుముట్టే బంగారు జాలువారు గోపురాలకి తక్కువేముంది ఈ ఆర్భాటాలన్నీ నవకుతంత్ర బ్రాహ్మణ వేషధారులు బెంగా బెదురులేక బతకడానికేగాని విశ్వజన సౌభ్రాతృత్వానికి యేమి ఉపకరిస్తాయో చెప్పగల విచక్షణా చక్షువుంటే ముందుపడండి—

విశ్వసుందర విలాసాన్ని విలోకించి తరించి వర్తమాన మానవాభ్యుదయం తెచ్చే అఖండమైన సంపూర్ణ శోభాప్రకాశమైన చందనమత సంస్థాన ప్రజలు ప్రపంచమునుండి బయటపడి సర్వ కళాసుందరమై నవయుగ కళ్యాణాంచితమునకై ప్రజా హృదయానికి నూతన దృక్పథాన్ని చూపి, రాగద్వేష భోగ లాలసత్వ స్వార్థములేని, పవిత్రవంతమై, వజ్రతుల్యమైన కవచముగా పామరజనాళికి సయితము సాక్షాత్కార మార్గనిర్మితమైన చందనమత ప్రబోధలు జరుగుతున్నై. ఇందు శాశ్వత ధర్మాలు ప్రజా ప్రపంచమున పేరుకున్న పురాతన పురుగుల్ని ఏరిపారేస్తే కాలసముద్ర గర్భమున ఈ నవకుతంత్ర దుర్మార్గ దుర్భరభారము నిండింది— తేజోవికాస జాతీయరత్నములిందు డాగియుండు దినములు తారుమారైనవి— నవయుగ నాణె

గాళ్ళు వెలగ మాణిక్యమునేరి చందనమత రాజ్యసింహ ద్వార ములకై అభ్యుదయ దివ్యజ్ఞాన గంగానదిపై పయనమైనారు — కాలపుగర్భ అభ్యుదయ విజ్ఞాన చందనమత విచక్షణ కరకు రంప పరంపరలకు చిక్కినది— ఇహ, జగమంతయు యేక మతమై తీరాలి. జగమే దేవాలయమని బోధపడాలి. ప్రకృత్తే దేముడని ప్రార్థనలు జరగాలి.

చందన తరున్యాయమేలాయని శాసనం రావాలి. ఇహ, నానాజాతి మత దేవాలయ ముస్తాబుల కే ముప్పు తేవాలి.

ముందుగా చందనమత స్వీకారము చేయాలి.

అదిగో విశ్వజనయిత్రి తన అభ్యుదయ ముద్దుబిడ్డల్ని పేరవిపంచి నినాద జోల గీతాలచే నవ్యప్రపంచ ఊయల మం చములో నూహాలుపోసి దూగాడించుచున్నది. చందన తరురాజ్య ప్రతిష్ఠ చెయ్యండి దేవస్థానాలికి స్వస్తివాచకాలు బలకండి—

విశ్వస్వరాజ్య పేరవిహార చందనమత దేవాలయ ప్రతిష్ఠ చెయ్యండి ఆగ్రహపడకండి అతుకు బ్రతుకుఘుంటంగాదు— ఆణిము త్తెములొలికే నా అభ్యుదయపలుకులు ములుకులుగా గానక ముందుకునచ్చి సత్యాన్వేషణ చెయ్యండి.

మీకు జయమగు గాత.

# దేవాలయం

హిందూదేశములో యేమూలవెతకినా దేవాలయాలే బయట పడతాయి. హిందూప్రజ బ్రాహ్మణసంఘముచే నాలుగుపాయలుగా చీల్చి పాలించబడుతుంది. వీరే హిందువుల మని గొప్పలుచెప్పుకొని మెప్పులువడసి స్వకుచమర్దనచేసుకొని తమ్ముతాము మరచి తారుమారు ప్రచారాలకిదిగి తండోప తండములుగా సభావేదికల్లో పురాణ శ్రవణాల్లో స్వాములవారి మఠాల్లో అమ్మవారి గుళ్ళలో జేరి సిగ్గువిడిచి నీతిబోధలు చేయించుకొంటున్న బ్రాహ్మణసంఘ దాసులు వీరు స్వబలము నెరుగని సన్యాససంఘముగా, సన్యాసులకు గోచరిస్తుంది.—

ఈ క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమాది నాలుగు జాతులుచేరి బ్రాహ్మణ వేషధారుల బోకరింపులకు బ్లాకులయి నారు. హిందూదేవాలయ నిర్మాణాలు విప్రులకుక్షి నింపడానికై వేసిన కోటలని హృదయమున్న వారాలోచించిన తేలుతుంది.

పోనీ, మీవిజ్ఞానాన్ని ఈ దేవాలయాల నిర్మాణానికై మాన్యాలిచ్చి వీరినిస్తూ ధనపాలుగానిలిపేరే మీనాలుగు జాతులు వారిలో వక్కరైనా ఈ హిందూదేశ 56 లక్షల దేవా లయాల గర్భాలయ ప్రవేశవాసనగల వారున్నారా మీరావే శముచే నొకకాలు లోనిడినారా ఆ కుక్షింబర జంధ్యాలు మీకంఠాలకురిత్రాళ్ళు కాకుండానా—

ఇట్టి అన్యాయపు, అనర్థక, నిర్మాణ, నిరర్థక దేవా లకు పెట్టే పెట్టుబడులు, బ్రాహ్మణ సంఘపట్టుబడుల కోసే, మీరారాధించిన నల్లరాయి దేవుడుకైనా గిట్టుపాటుకానటంలా—

ఈ ధర్మాదాయాలతో మీరునిర్మించే దేవాలయాలిహ చాలు. కొలిచేవారికన్నా కొలిపించుకొనే దేముళ్ళ సంఖ్య పెరిగిపోయింది——

బ్రాహ్మణ మఠాలు పంచుకోగా మిగిలినది దీపారాధన కూడా నియామకముగా జరగాలనే బోర్డుకూడా వెలసింది——

ఈ జాతికి జిరాయితీ లేర్పడ్డాయి వీరి ఆగడం మరింత అనర్గళంగా సాగుతూంది. హిందూ దేవుళ్ళకి హిప్‌హిప్, హుర్రో లుకి ఈ ఫరమానాదార్ల పప్పుధప్పళాలికి లోటన్న విచారం తీరింది——

ఇహ, మీరావిజ్ఞానము విను వీధికొచ్చింది. కొత్త గుళ్ళు కడదామనే దురూహాలు కట్టిపెట్టి, లక్షరూపాయలు పెట్టి యే అంకమ్మగుడో కట్టేబదులు వందమంది బీదమానవులకు స్థిర నివాసాలు వేసి మీబోర్డులు కట్టండి.

దేవాలయట్రస్టీలమనే అమ్మవారి పారాదార్లంతా దేవాలయ ఆదాయాలతో కళాశాలలు యేర్పరచి ఉచిత విద్యా భోజన పద్ధతులకై దేవాలయ బొక్కసాలలోనుండి ఇచ్చే శాసనం తెండి. బీద విద్యార్థులకు గురుకులాశ్రమాలలో మాతృ భాషతో ఉపదేశాలు జరిగేలా శాసించండి——

ఇహ వారి గీర్వాణాలకి తావియ్యకండి ఈ విధమైన పుణ్యము మీ గోపుర నిర్మాణాలకురాదు. బీదమానవాభ్యుదాయాని కుపకరించే దేహపరిశ్రమాలయాలు నిర్మించండి. క్రొత్తగుళ్ళు కడదామనే వాంఛాపరులు పాతగుళ్ళకు దీపారాధించండి— అందు జాతి మత భేదములు లేకుండా ఆలయము లోని దేవుని అర్చించే అధికారము ప్రతివానికి ఇవ్వండి— మీ కష్టార్జిత సర్వజన స్వతంత్ర నిర్మిత దేవాలయ గర్భాలయ దర్శనమే లేదే మీ స్వంతధన ప్రతిష్ఠాపన పూజారి దేముడే మిమ్మల్ని లోనికి రానీయడే—

సర్వ దేవారాధికులు దేముడో దేముడోయని చెవులు దిబ్బళ్ళెత్తేటట్టు గోవిందలు కొట్టే భక్తబృదంకే ఆసిలావిగ్రహ పాద పద్మముల నమస్కారమునకే ఆస్కారములేదే— అట్టి తమరు హిందూమత దైవారాధకులమని చెప్పుకొనే బదులు బ్రాహ్మణ సంఘారాధకులమని చెప్పుకొనుట ధర్మం—

స్వదేశము గావాలి స్వపరిపాలన రావాలి, మిమ్మల్ని బ్రాహ్మణులు పరిపాలించాలి గాని— మీయందేది స్వభుజ విజ్ఞాన వీరబలం—

అసలు హిందూమత ధర్మాలే అగ్రజాతికి అరులుపెంచి బొజ్జలునింపే రత్నగర్భిణి—

ఈ జాతిధర్మాల్ని సృష్టించేమనేవాళ్ళు ఆచరించక పోయినా అధికారాల్ని చెలాయిస్తున్నారు—

అనుశ్రుతంగా ఆచరిస్తున్నవారు, అద్దాల్లా కనుపిస్తున్నా పిరికళ్ళకు మొద్దుల్లాపరికిస్తూన్నారు——

దేశానికి ముక్తిరావాలి ప్రజలకు భక్తికుదరాలని ఈ బ్రాహ్మణ శిలాదైవాల్ని ప్రార్థిస్తే యేంఫలం, కదిల్తే కర్పూరం మెదిల్తే మెస్మరీజం. యెంతమీరు లంచాలిచ్చి అలంకారాలు చేయించినా తమకు ప్రత్యక్షమై మీ నెత్తిమీద టోపీ వేస్తున్నాం అనే శడగోపురం పెట్టే బ్రాహ్మణ దైవమే ప్రత్యక్షం అగుతాడుగాని మీకోరికలు తీరుస్తాడనే ఆ రాతిలోని దేముడు బద్ధలై బైటపడడానికేమైనా గుండెలుంటేగా,

కాకపోతే యే బంగారు ఉత్సవవిగ్రహాలో ఊరేగింపులు జరిగేరోజుల్లో క్షత్రియ, వైశ్య, శూద్రుల్ని కాపుదలకుంచి పంచముల్ని లాగమంటారు, వారు ఘంటలు పట్టుకొని రథారూఢులై కూర్చుంటారు——

దైవారాధకులమనేవారి గుండెలకు ధర్మమంటే యేలావుండాలో నాటాలి సాటిమానవులు తిండిలేక దేశమంతటా డొక్కలెండిన యెండలోనుండి ఆకలిమంట లెగదన్నుచున్న ఈ రోజులలో వారి ఆర్తనాద రోదన గాడ్పులు మీ చెవిసి తాకనీయకుండా ఈ జేజే ఘంటల బైరాగులు మోసము చేయుచున్నారు——

నిత్యాన్నదానము జరపండి, శాశ్వత ధర్మగృహాలు కట్టి బీద జనానికివ్వండి, నేడు మనకు కనిపించే అన్నదాన ధర్మ

వ్యాంగ స్త్రాత్తాల్లో స్వంత కాపురాలుపెట్టి బాటసారుల దగ్గర కిరాయిలు కట్టి పురపాలక సంఘమువారికి పన్నులు లేకుండా చేసుకొనే వాళ్ళను దండించండి—

సుంకము లేకుండా జాతి మతభేదము తలచకుండా సాటిమానవ బాటసారులకు భోజన సదుపాయాలు జరిపే ట్రస్టీలను వేయండి— రెప్పలెత్తి వక్కసారి హిందూదేవాలయ కృూజు మృగాల్ని పరికించండి. యెటువంటి గారడీల్ని చేసి సుకుమార బిక్షలందుకొని బంగారు పొన్న కొయ్యల్లా నున్నగా మీాపై నియంతలై నిరంతర దురంత దుర్మార్గ దురూహ తంత్రాల్ని మంత్రాల్లో యిరికించేరో చూడండి, సర్వాంతరయామిమైన భగవంతుని రాతిలో చెక్కించి ఆకార వికార రహితునికి అవతారాల్ని కట్టబెట్టి ఇనుప తలుపుల దేవాలయాల్లో ఖయిదీని చేసి కూర్చుండబెట్టి పండుగలని పబ్బాలని ప్రచారాలు చేయించి దండోరాలు వేయించి మీాచే ఫల పుష్ప పలసార కానుకల్ని మోయించి ఈ పూజారి పింజారి యేలా దేవునికి నివేదిస్తున్నాడో వినండి—

కొండవీడు చాంతాడులా చాదస్తపు రామాయణ పారాయణ చేసి తుదకు పరిభాషలో యెంతయు క్తిగా తమకళ్ళకు గంతలుకట్టి చెవులకు తాళాలువేసి నోటికి కళ్ళెంబెడుతున్నారో వినండి. "ఇష్టఫల కామ్య సిధ్యర్థం రక్షణ తాంబూల ఫలపుష్ప చందనం కరిష్యామి" అనే గీర్వాణం అర్థం యేమిటో వచ్చిమనికి తెలుస్తేగా. మనము తీసుకువెళ్ళిన ఫలపుష్పములు

ఆయన దేవునికి తనఇష్ట కామ్యాలు సిద్ధించటము కొరకు నివేదనము చేయుచున్నాడట. (కరిష్యామి అంటే తానుచేయుచున్నాను.) కష్యేత్ అనాలి. ఈ గోలంతా యెందుకు తమరెంతో భక్తివిశ్వాసములతో ఇంతదూరము మోసుకొనివెళ్ళి ఆగడపడాట్రేవాత మీనుదుట లేదు.

సర్వాంతర్యామి అనే భగవంతునికి కూడా జాతిమత విభేదాలుంటే అట్టివాడు ఫక్తు ఈ సంఘానికి భుక్తమైన దేవుణ్ణి మనమెందుకు పూజించాలి వకరి కట్టుబాట్లలో ఉండే దేవుణ్ణి తొత్తనాల్సిందేగాని, దేముడనడం పొరపాటు. ఇహ ఈ ఇంద్రజాల మహేంద్రజాల దేవాలయాల్లో జొరకండి ఆ టక్కుటమార పూజార్ల గజకర్ణ గోకర్ణ విద్యలకు బుద్ధినివ్వకండి ఏకైక జాతీయ ధర్మోపదేశాలతో లేచిన నాచందనమత విశ్వప్రపంచ దేవాలయ ఆరాధనలు జరపండి. మీకు జయమగుగాక.

# హరికథా కాలక్షేపం

హరిదాసులు హరికథలు వీటి అభిమానులు దేశములో రైల్వేపట్టాలా పెరుగుతున్నారు. వీరి దినదిన ప్రవర్ధమానానికై ఇంకా శ్రద్ధవహించాలి—

వీరీ ఇనుపదారిపై ధూమశకటాలై చూచినస్టేషన్లే చూస్తున్నారంటే ఈపెద్ద రైలుస్టేషన్లలో స్టేటుమెంటుబోర్డులపై వీరికి యెన్నాళ్ళు కనిపించినా రాధావిరహం, సీతావియోగం, ద్రౌపదీ వస్త్రాపహారం, క్రిష్ణ తులాభారం మొదలైన ఆనంద వినోద విస్మయాదర్శక కథలబోర్డులను వల్లించి దాసుల నోటి నుండి గోకంటిపాటగా జల్లించటం వింటున్నాం—

ఏ కథగాని, యే నాటకంగాని, యే సినిమాగాని, యే చిత్రలేఖనంగాని, యే శిల్పంగాని, యేకవనంగాని యే ఆధ్యాత్మికంగాని వింటున్నాం అంటే వినోదంకొరకే సనుకోకండి— వీటి ప్రచారాలు విశ్వకళ్యాణానికి ఆదర్శకమయ్యే ఉన్నతము పవిత్రత వకటుందని గ్రహిస్తే పాతస్టేషన్లలోనుండి క్రొత్తస్టేషన్లకు వచ్చేవారమే.

నేడు మనముందు జరుగుచున్న ప్రచారాలు స్వార్థ ఉదర రథారోహణాలకై మృదంగం గోలచేయించి ఫిడల్ డొక్కులు గీకించుకొంటే శ్రోతలకు శ్రవణసౌఖ్యం, తమకు ఉదర సౌఖ్యం. ఇందు మానవాభ్యుదయాన్ని ముందుకు తెచ్చేదేమీ లేదని నిద్ర దండుగైన నిర్మల నిజానువర్తులు గ్రహిస్తారు—

ఈ కళలన్నీ సామాన్య ప్రజలకి జ్ఞానాభివృద్ధిని పెంపొం దించడానికే సృష్టింపబడ్డాయని తలంచాలి.

ఈ ప్రపంచ ప్రజా సంస్థల్లో అనాచారాల్ని రూపు మాపి మంచినడవడి నేర్పించేటందుకు నానామత మసూచాన్ని అంటకుండా యేకైకమతం చేసేటందుకు, తమమాతృ దేశాన్ని ఇతరదేశాలు ఉన్నతధర్మాలతో కొలిచేటందుకు, ప్రతి మానవ జీవికి విశాలదృష్టినిచ్చి సత్యాన్వేషణము చేసేటందుకు, అవిజ్ఞాన స్త్రీ పురుష బాలబాలికలకు విశాలప్రపంచవాణి బహుబంగారు పల్లకీలలో సూక్ష్మదృష్టితో కూర్చొనేటందుకు, ఈ వివిధమైన బోధనా పద్ధతి అనుసరించాలి.

కేవలము వినోదాలకే ఉపయోగపడే వీధులంట పందిళ్ళల్లో చిరుతలుబట్టుకొని పట్టు పీతాంబరాలు కట్టుకొని సింహ్వాతలాటాలు తగిలించుకొని గంగిరెద్దుల అలంకారాలతో ఆడవాళ్ళు అందెలు మోటనితీసేస్తే మొగాళ్ళు ధరించుట మొనగాడితనమే ననుకొండి. గాని ఈ (శ్రీ) ముద్రమారణ గోవిం దలతో ఇంకా కాలముగడుపుట ప్రజాశక్తికి తృప్తిగాకపోగా నొప్పి గలుగుతున్నదని తెలుసుకోండి—

నేటి ప్రపంచస్థితిని గుర్తించాలి. ప్రజాసామాన్యానికి స్వాతంత్ర్య నియంతృత్వ శక్తిని ప్రసాదించేలా ఉండాలి.

నేటి అఖండ యుద్ధపు మండుటెండలోనుండి వెన్నెల చలువ నీడచేరే చందనసేవ ప్రబోధించాలి. క్లిష్టతరమైన వ్యతిరేక మత గాలిదుమారాల్ని యెదుర్కొనే చెలాకుల్ని చేయాలి. మానవ విజయము చేకూరుటకై మనమందరం యేకం కావాలి.

ప్రజాశక్తిని యేకముఖంతా నడిపించే విజయవంతమైన చందన తరుకథల్ని కల్పించి భక్తజనాళికిపొయ్యాలి, ప్రతిజీవి గడియారమనే కుంచముతో తనతన కాలమును కొలచేటట్లు చేయాలి.

నూతన చైతన్యజీవం స్వతంత్ర భారతికిపోసి హారతు లీయాలి.

పాత రోతకథల పారాయణాల్ని పారద్రోలాలి. తత్తకిట తద్ధిమితలతో ప్రొద్దుపుచ్చుటకీ కార్చిచ్చు దినములు తగవని తెలియచెప్పాలి.

దేశ రక్షణోపాయానికై వివిధ మార్గాలుగా వ్యూహాలేసి ఆయుధాల్ని ప్రయోగించే చాకచక్యాల్ని చలాయించేలా చేయాలి.

సివాజీ, రాణాప్రతాప్, అమరసింహుల్లాంటి వీరుల చరిత్రాల్ని కథలుగా ప్రబోధించాలి. చందనతరు సుగంధ ప్రభాత డక్కారావాల్ని ధణ ధణ లాడించాలి.

ఇట్టి నవీన పంథాలనేకములు వేయగల మేధావులు మనలోనున్నారు. వారి రచనలను ఆదరించి నందన, చందన మత దేవస్థానాల్ని తిలకించండి.

బానిసత్వము వారసత్వం కాదని కన్నులు తెరవండి.

కలిసీళ్ళకు నోచని కూలి గోలను కనిపెట్టేకథలు చెప్పండి కూలిరాజు సుఖ జీవనంచేసే ఉపాయాలల్లండి.

బీదవాన్ని బాధపెట్టే బోధల్ని ఖండించే కావ్యాల్ని లేపండి. ప్రజాశక్తికి ఉత్తేజాన్నిచ్చే చందనమత నూతనపంథాన్ని ఆరాధించండి. హరికథా సుధారస పిపాసులకు ముక్తికల్గును, ప్రజలకు శక్తికల్గును, పరదేశమునకు భక్తిగలుగును. ఈ యుక్తిని మీశక్తితో ప్రయోగించితే రక్తి కడుతుంది. మానవాభ్యుదయానికి మోక్షద్వారము తెరుస్తుంది.

# సాక్షాత్కారము

నవయుగ ప్రపంచ విద్యుచ్చక్రమునుండి నూతనాదర్శనములు, వినూత్న దృక్పథములు, అభ్యుదయ జీవనములు బహు చురుకైన కిరణాలుగా లేచి ప్రజాజీవిత విజ్ఞానమునకు ప్రకాశవంతమైన రెక్కలుబెట్టి భావికాల భాగ్యోదయానికై నెట్టుకపోతున్నై.

యుగయుగాల తెరలచాటున మరుగు పడిన దేముడు యేనాటికి సాక్షాత్కారము కాడు అన్న అలజడిలేచి బలపడింది.

దీని నిజానిజము గుర్తించాలనే మానవ హృదయాలు తల్లక్రిందై దద్దరిల్లి ప్రచండ పరివర్తనములు గావించుచున్నారు.

నేటివరకీ సాక్షాత్కార దైవాన్ని ప్రత్యక్షంగా చూచేమనే సత్తాగలవారు ఈ వెలుగులో లేరు.

అంచేత భావి స్థితిని గూర్చి ఇదమిద్ధంగా నిర్ణయించేవారు కానరాక రెపరెపలాడేలోకం. ఉపన్యాసాలిచ్చే బోధకరింపు నోటినుండి దేముడేమైనా జార సాక్షాత్కార మూతాడేమోనన్న భ్రమ ప్రజల్లో ప్రమాదంగా బలిసింది.

ఇంతవరకూ దేశదేశాల ఉపన్యాసాల బాకారావాల్ల నుండి దిగినసారము స్వార్థమే పరివ్యాప్తమైంది. దీన్నుంచి లేచిన సాక్షాత్కారమనే గోల విజ్ఞానచవికి కంటక మయిందనే చెప్పక తప్పదు.

ఇహ నానాదేశ మతాల నవనాగరికత విజృంభించి నాలుగు దిక్కులనుండి నాజూకుగా బజారులోకి హాజరైంది.

తరతరాలక్రింద తమ్ము తామెరుగని అజ్ఞానపుదినాల్లో అరణ్యపర్ణశాలలలోజేరి కూర్చిన ఆనాటి అనాగరిక జాబితాలు నేటి విశాల విశ్వప్రపంచ విజ్ఞానవాణిదృష్టికి.

చంటిపిల్లవానికి బూచివానిని చూపెడతామనే భయమెలా కలిగిస్తామో ఆమాదిరి సరుకిదియని గ్రహించ గలిగింది.

ప్రత్యక్షం పరోక్షమయింది. ఈ కారణముచే ప్రపంచ విజ్ఞానలక్ష్మి భ్రాతృభావము విడిచిపెట్టి శతృభావముతో చెలరేగ వలసిన దుస్థితిచే దుర్లక్ష్యాని కొచ్చింది.

అసలు కావాలనుకొన్న దైవ సాక్షాత్కారాన్ని మరచి ధనపిపాస రాజ్యకాంక్ష ప్రబలి విశాలదృష్టి నానాటికి సన్నగిలి స్వసంఘాలు, స్వమతాలు స్వార్థ సర్వార్థులై బలసంపన్నులు బోయిలై వెనుకబడిన మానవసంఘ సముదాయముపై విహారాలు సాగించి సాధించే పుస్తకాల్ని దస్తూరాలుగా పామరలోక పుస్తక భాండాగారాల్లో నిలవేసేరు.

ఎదుటవా డేజాతివాడైనను విజ్ఞానవంతుడైన మానవ జాతి సంతోషముతో ప్రోత్సహించాలేగాని వాని అపశబ్దము లెన్నుకొని తన్నుకొనుట జాతీయత కాదు.

పొరుగు పచ్చగానున్న పొయ్యిలో ప్రక్షాళము గావించుకొనుట యేమిధర్మం? ఎదుటివాడు తమకు ఆజన్మాంతరము దాసోహానే చేయాలనుకొనేదే మత ఆచారం.

ప్రేమధనరూపమే యెరుగక కృత్రిమధనరాజ్య సంపాదనలకై కూనీలు చేసుకొనే మీరు దైవ సాక్షాత్కార ధనాన్ని యెప్పటికీ చూడలేరు.

కామకలిమిగల యొక బలాఢ్యుడు వకస్త్రీని కామ వాంఛచే కోరుకొని చిత్రించి తదేక దీక్షతో ధ్యానించి నిదురించినవాడు స్వప్న కథల్ని కన్నాడంటే ఆ స్వప్న సాక్షాత్కార ఫలితము తానెంతవర కనుభవించగలిగెనో అనుభవజ్ఞులకు తెలిసిన విషయమే.

ఈ యువకుడు కామారాధనచే కలలోబొందిన భోగ సౌఖ్యాన్ని ఆ స్త్రీకేమైన తెలియునా?

ఇట్లే వకభక్తుడు యేదోవక ఆకారాన్ని దేముడని ప్రేమించి నిష్ఠాగరిష్ఠుడై గంపెడంత ఆసతో వ్యసనపడి వెంపర్లాడి భగవత్ సాక్షాత్కార నిరీక్షణతో పరుండి కాంచే తన కలలో తానారాధించే బొమ్మాకారమే ప్రత్యక్షమై అగ్రహారాలే యిచ్చింి దనుకొండి. అవేమైనా ఈ కల గాసినవాడు

నావనిగాని దేముడే తనకనల్లో ఈ గ్రామాలు తనకు ప్రసాదిం. నాడనిగాని అంటే ఆ పల్లెజలయినా వానినోటిని. మూయించక మానరుగదా.

ఇహా ఈరుసన కళ్లోచూచిన దేముడ్ని చూచి తరించానని ప్రత్యక్షమైనాడన్న అవతార కథల్ని కల్పించి ప్రజల్ని జడిపిస్తే ప్రత్యక్షమా ?

ఇంతలో ఈభక్తుడూరుకోక ప్రభల్ని కట్టించి పేరంటాళ్ళి ఊరేగించి డప్పులు సరిపించి భవిష్యత్ పండిత పామరముఠాల్ని పిలిపించి ముహూర్తాలు పెట్టించి గోపురాలు వేయించి స్వాస్తి బంధనావిధాన బూతుబొమ్మల్ని తీర్పించి తన కల్లోగన్న దైవాన్ని కొయ్యతోనో, కోపుత్తోనో, రాతితోనో, రాగితోనో చేయించి——

చీకటిగదిలో కూర్చోబెట్టి పూజారి సింజార్లకు పరి పూర్ణ హక్కుల్ని కట్టబెట్టి తాచెడ్డకోతి వనమల్లా చెరిచిందనే టట్లు పరమ భాగవతోత్తముల పురాణాలతో భక్త జ నా ళి గోవిందలతో మిాంకాలము తరగదీసుకొనుచూ——

తుద కీ భక్తజనాళి ఆకారంకూడా ఆ కామాంధుడు కలలో వెన్నెల్ని చూచిన చందముగా తాగెంతిన సాక్షాత్కార మాలేసింది——

సాక్షాత్కారాన్ని గూర్చి మా గురుదేవు డుపదేశించిన ఆశయాన్ని విని యేదారి నిజమో ఆలోచించండి——

భగవంతుడనే వాడొకడున్నాడే అనుకో అతని ఛాయయే ఈజగమనుకో అట్లే నీవును——

నీవు పుట్టగానే నీతో పుట్టింది నీడ. ఈ నీడ యెన్నాళ్ళు న్నంటి యున్నను నీవు దాని యెప్పటికప్పుడు చూడగలవు. గాని ఆనీడ నిన్ను యెన్నటికీ చూడలేదు——

అట్లే భగవంతుని నీడ అయిన నిన్ను భగవంతుడు చూడగలడుగాని నీవా భగవంతుని యెన్నటికి చూడలేవని నమ్ముము——

అసలు దేముడనే తంతే వకసుడిగుండం. ఈఅగాధాన్ని పడ్డ మానవ నౌకలు మన గాలిదుమారాన్ని అప్పుడే లక్ష్య పెట్టవు——

మన ఈతకు ఆసుడిగుండములోని మొసళ్ళు అందుకో లేక మనల్ని మింగాలనే గుసగుసల కిసకిసలతో కొరలికిలించి నౌకలు ఝాడిస్తుంటై——

వీటి ముద్దర్లుతిన్న పెద్దలు దేముడికి పెండ్లిచేయాలని పిల్లల్ని కనిపించి నివాళ్ళియాలని ఆకలిబాధతీరే తగినశాశ్వత మాన్యాలీయాలని, ఆరాధకుల్ని పెంచాలని మంచాలేసి మంగళహారతులతో సంగీతాలుతీసి పవళింపు సేవలో పడతారు——

మానవ సంఘాన్ని మొలిపించిన విశ్వవినిర్మలవిరాట్ ఇదంతాచూచి పకపక నవ్వుకొనుచు యేకోదర స్వభావ వీచికలులేని వీరిచిన్నెలు నానాటికి ప్రకృతికే భంగము గలుగుచున్నై——

ఏకజాతిగా, యేకోదరులుగా, యేకదేశముగా నున్న రోజులల్లో వారివారి జీవిత సామ్రాజ్యాల్ని మానవ యేకైక

జాతీయపట్టాభిషేకాలతో పసందుగా జగజ్జనని వడిలోనుండేదే గాని ఈవిధమైన మానవ విశ్వకళ్యాణానికి వికారాకార మత వేరుపురువులు బయలుదేరి మామతం మంచిది మారాజ్యం మంచిది మా జాతి గొప్పది అనే కేటలాగు పుట్టలేదు. సత్య సంరక్షణోద్ధరణ సత్యాలచందనమత సుబోధ కీర్తనలు పాడండి—వేదాంత భగవన్మతరాజ్య పట్టాభిషిక్తులుగండి. అప్పుడు ప్రజాశక్తి భగవతిఅయి ప్రత్యక్షమౌతుంది. —ఏకైక ప్రపంచ భోగములతో తమకుతామే పాలకులయి మీ మీ పిల్లలకు భావికాల విలయాలకు తావులేని ప్రత్యక్ష దైవాలవ్వొదరు.

అన్యోన్య భయదాయకముగా ఈ జరుగుచున్న క్రూర వీరులు లజ్జా భయాలతో చేరి చందనమత మహత్తర సర్వజన సమానాశయానికి వందనములిడి వన్నెగల ప్రపంచ ప్రజాయేకైక శక్తియే చందనమని నూతన ప్రసాదాన్ని పొంది అజేయులయినారు.

ఈ నా దూకుడు హిందూమత సంస్కారానికే దేశకాల పాత్రాదులకు మేలుకొలిపే సంస్కర్తలు రావాలి. ఈ విలయ కాలయుద్ధాలు అరికట్టాలి. మానవమహత్తర విజ్ఞానము ముందుకు దూకుడుతో రావాలి.

తమకు విజయము చేకూడాలి.

తమకు జయమగుగాత.

కవిరాజ

డాక్టర్: **సత్యాల నరసింహాబు పాత్రుడు,**

**కవితా సామ్రాజ్యం - విజయవాడ.**

కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము ... వ్యాసకులు ... నె-2